౫ చాళుక్యవంశమున జనించినవినయాదిత్యనామధేయుడగు యుద్ధమల్లుడు చిత్రకూటదుర్గమునుఁ గైకొనెను ఆతని కుమారుఁడగు నరికేసరి వేంగీదేశమును బలముచే నాక్రమించె. అతనికి నరసింహభూపతియు నతనికి రాజాదిత్యుడు నాతనికి రెండవయుద్ధమల్లుడును జనించిరి. అనంతరము రెండవ నరసింహదేవుడు పుట్టి గూర్జరసైన్యములను జయించియుండెను. ఇతనికి రెండవ యరికేసరి యుదయించెను. మహాసేనావృతుడయినయీతడు గోవిందరాజురాజ్యము నపహరించి, బిజ్జని రక్షించెను. ఈతని బిరుదములనుండి యీతడు త్రిభువనమల్లుని సామంతుడని తెలియుచున్నది. ఈతనికి గుణకశర్మ యనునాతడు మంత్రియు సన్ధివిగ్రహియునైయుండెను. బద్దిగభూపాలుని మనుమడగు తంత్రపాల పెద్దనాయకునికోరికను మన్నించి అ × లపాలకపట్టణమునం దరికేసరి భూదాన మొనర్చెను. ఇందలి గోవిందరాజు, పశ్చిమచాళుక్య దండనాయకుడుగను, బిజ్జడును ఆంధ్రచోడసామంతులలో నొక్కరుడుగను, నిర్వచనోత్తరరామాయణమున తెనుంగ బిజ్జనామమున పేర్కొనబడియు నుండిన బిజ్జనచోడమహారాజని చెప్పవచ్చును. ఈ బద్దెన యెవ్వరో తెలియరాదు. పై నుదహరింపబడినవారందరును చాళుక్యవిక్రమాదిత్యుని కాలమునందుండినవారు. ఈ శాసనము వేంగీచాళుక్య, ఆంధ్రచోడవంశములకు చాల ముఖ్యమైనది.

## 22

౧ దోసపాడు: (నల్లగొండజిల్లా) గుండ్లపల్లెపాటుమీది పాడుదేవా మీద.



౨ *

౩ శా. శ. ౧౧౧౨

౪ తెలుగు

౫ దోసపాటి రుద్రయ్య హరిహరదేవునికి తనతండ్రి గుండ్రడ్డికి, తనతల్లి కామసానికి పుణ్యముగానిచ్చిన ధర్మమును దెలుపును.

## 23

౧ నాగులపాడు: (నల్లగొండజిల్లా)

౨ రామరాజుమేడ్రాజు

౩ శా. శ. ౧౪౦౪

౪ తెలుగు

౫ గోలకొండరాజ్యమునకు ముందు వెలమవారివద్ద రాజప్రతినిధిగానుండి సూర్యాపేటతాలూకాలోని భాగములను రామరాజు మేడరాజు పాలించినటుల దత్రత్యులు చెప్పుచున్నారు. ధర్మస్థాపకుడయిన అక్కనకు మేడరాజునకుగల రాజకీయసంబంధము తెలియుటకవకాశములు లేవు. చాళుక్య ౧౬ వ శాసనములోను, మేడరాజు ప్రసంగము కలదు.

## 24

౧ ముదిమాణిక్యము: (మెదకుజిల్లా) భోగేశ్వరస్వామిగుడిలో.

౨ మల్లిశెట్టి

౩ శా. శ. ౧౨౫౮

౪ సంస్కృతము

౫ తటాకనిర్మాణప్రశంస యీ శాసనమునఁగలదు.

